Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ నవంబరు నెల 21 వ తేది శుక్రవారం [నె 36 రు

## ఇంగ్లాండుపై దాడి జరుగునా, జరుగదా?

### దాడి ఏరీతిగ జరిగినా ఎదుర్కొనుటకు ఇంగ్లాండు తయార్.

### చర్చిల్‌గారి ఉపన్యాసాల సారాంశము.

1940 వ సం॥ జూన్ మాసంలో ఫ్రాంసు జర్మనీకి లొంగిపోగానే, చర్చిల్ ప్రధాని బ్రిటిషు దేశీయులను హెచ్చరించెను. శత్రువుయొక్క కోపమంతా యింక తమదేశంపై పడుతుందని, బ్రిటీషు దీవిపై బడంది తనకు యుద్ధంలో గెలుపుండదని హిట్లరుకు తెలుసని, చర్చిల్ అనెను. అప్పటికి జర్మనీవిమాన బలమే బ్రిటను విమానశక్తికన్న ఎక్కువగ వుండినా, బ్రిటిషు వైమానికుల నిరోధశక్తివలన జర్మను సేనలు యితరదేశాలలోవలె ఇంగ్లాండుపై మెరుపు యుద్ధంచేసే యత్నాలు ఫలించలేదు. 1940 వ సం॥ ఆగస్టు 15 వ తేదికి లండనులో ప్రవేశిస్తానని ప్రగల్భాలు పలికిన హిట్లరు, మొదటిసారి పరాభవం చెందెను. ఈ పరాభావానికి సంజాయిషీగా హిట్లరు 1940 వ సం॥ సెప్టెంబరు 4 వ తేదిన తన అనుచరులకు యిట్లు చెప్పెను. "నేను ప్రతిచర్య అతిజాగ్రత్తగ, తెలివిగా యుక్తియుక్తంగా నిర్ణయించుకోవలసియుండుట సహజము. ఇంగ్లాండులో ఎవరైనా, 'ఏమి యింకా అతను రాలేదు' అని అడిగేమాటుంటే, 'తొందరపడకండి వస్తున్నాడు' అని చెప్పండి" అని నుడివెను. అతను చెప్పినట్లు అతి జాగ్రత్తగా తెలివిగా యుక్తియుక్తంగా ఎంత ప్రయత్నించినా బ్రిటిషు దేశరక్షణ యేర్పాటులను భేదించలేక పోయెను. అందుకనే 1940 వ సం॥ అక్టోబరు 21 వ తేదిని చర్చిల్‌గారు తమ విమానాలు వాటిపని యవి బాగా నిర్వర్తించుచున్నవనియు, హిట్లరు తలపెట్టిన దాడికై వేచియున్నామనియు, స్టీమరులుకూడ సిద్ధంగా వున్నాయనియు చెప్పిరి.

### దాడి బెదురు పోలేదు.

బ్రిటిషు ప్రధాని ఎన్నడు తన ప్రజలకు అశ్రద్ధకలిగించు మాటలచెప్పలేదు. హిట్లరు సేనలుఎపుడువచ్చి అకస్మాత్తుగ ఇంగ్లాండుపైబడినా పడవచ్చునని చెప్పుచుండెను. ఎప్పుడు కావలాకాస్తూ సిద్ధంగా నుండవలెననెను. ఏడాది క్రింద వున్న ప్రమాదం యిపుడు లేదనుకోరాదు. ఏడాదిక్రిందట 1940 వ సం॥ జూన్‌లో ఫ్రాంసు పడిపోగానే హిట్లరు తన దృష్టిని ఇంగ్లాండుపై మరల్చెను. జర్మను విమానాలు ఇంగ్లాండు తీరంపై దాడివచ్చి మంటలుపెట్టి దారి చూపుచుండగా, నావలలో ఇంగ్లీషు ఛానెలు సముద్రం దాటివచ్చుటకై ఫ్రాంసు తీరాన అనేక నావలు సిద్ధంచేసి యుంచబడెను. సైనికులు నావలెక్కుట దిగుట అలవాటు చేసుకొనుచుండిరి. కాని వారికి మంచి పాఠం నేర్పబడెను. 1803 వ సంవత్సరములో ఫ్రాంసు చక్రవర్తి నెపోలియను యిట్లే ఇంగ్లాండుపై దాడికి ప్రయత్నించెను. ఇంగ్లీషు ఛానెలు చిన్న మురికి కాల్వవంటిదని, ధైర్యమున్నవారంతా ప్రయత్నిస్తే కాలు దాటగలరని నెపోలియను అనియుండెను. కాని బ్రిటిషువారి నౌకాదళం అతన్ని కాలవకు అవతల వైపునే యుంచెనుకాని దాటనివ్వలేదు. నెపోలియను సేనలు ఆగ్నేయంగా మరలిపోయి మొదట ఆస్ట్రియాపైకి, తరువాత తూర్పున రష్యాపైకి దండెత్తవలసివచ్చెను. 1940 వ సంవత్సరములో హిట్లరుగతి అంతే అయింది. అతని విమానాలు కాల్వ దాటాయి కూడాను. ఆ కాల్వను యీ రోజు విమానాలలో అయిదు నిముషాలలో దాటవచ్చును. దాటి వచ్చిన జర్మను విమానాలు తిరిగి అతివడిగా పోవలసివచ్చెను. ఆ పోవడంలో కొంత సేనకూడా నష్టపోక తప్పిందికాదు. బ్రిటిషువిమానాల బాంబులు ఫ్రాంసుతీరాన చేరిన జర్మను నావల వరుసను చేదించినవి. హిట్లరు సేనలుగూడ నెపోలియను సేనలవలెనే ముందు ఆగ్నేయమున బాల్కను రాజ్యాలపైకి, తరువాత రష్యాపైకి మరలవలసివచ్చెను. 1941 వ సం॥ జూన్ తరువాత హిట్లరు టాంకులు, విమానాలు ఫిరంగులు వేలకువేలు నష్టమయినవి; సైనికులు లక్షలు చచ్చారు, చస్తున్నారు. అందుచే బ్రిటనుపై యింక అతని సేనలు దాడివచ్చుట కల్ల, నెపోలియను సేనలవలెనే హిట్లరు సేనలుగూడా రష్యానుండి త్వరలో మరలిపోయి యింకోచోట పూర్తిగ ఓడిపోవునను భావం వ్యాపించింది. అది పొరబాటు.

అట్టి భ్రమ బ్రిటిషు ప్రజలకు కలగాలనే హిట్లరు కోరుతున్నాడు. రష్యాలో తన సేన ఇరవై లేక ముప్పైలక్షలు పోగానే, ఇంగ్లాండు సంతసించి బ్రతుకు జీవుడాయని దండం పెట్టి కూర్చుంటుందని అతని యూహ. 15,000 లక్షల జనంపై అధికారం వహించాలని కోరుతున్న హిట్లరుకు 20 లక్షల సైన్యం పోతేయెంత. బ్రిటిషువారు యీరీతిగా ఏమారియున్నపుడే, ఫ్రాంసు తీరాన తాను యింకా ఉంచియున్న విశేష సైన్యాన్ని బ్రిటనుపై పంపును. హిట్లరు రష్యాపై యుద్ధంలో గెలిస్తే తరువాత ఇంగ్లాండుపై దాడిరాగలదని అందరంగీకరిస్తారు. కాని రష్యాపై యుద్ధంలో ఓడినాగూడ ఆదేపని జరుగవచ్చును. తూర్పున రష్యాపై ఎంత ఎక్కువగా ఓడితే, అంత ఎక్కువ పట్టుదలతో యింకోచోట గెలవాలనీ తద్వారా జర్మనుప్రజల నిరుత్సాహం పోగొట్టాలని హిట్లరు ప్రయత్నించును. యూరోపు పరిశ్రమలన్ని అతనిచేతులో ఉన్నాయి. 120 లక్షల సేన అతనివద్ద తయారుగానుంది. ఇంకో 40 లక్షలు సిద్ధంగావుంచేడు. అందులో మూడోవంతే యిపుడు రష్యా యుద్ధరంగంలో పోరుచున్నది. మిగతా సేన అంతా యూరోపులో ఆక్రమింపబడిన దేశాలన్నింటిలో నుంచబడియున్నది. జర్మనువిమానదళాలలో నాల్గు రష్యా యుద్ధంలో ఉన్నాయి. మిగిలిన మూడు దళాలను (సుమారు 5,000 విమానాలు) బ్రిటిషుదాడికి ఉపయోగించవచ్చును.

అయితే, ఇంగ్లాండుపై దాడి హిట్లరు సేనలకు సులభమని చెప్పవీలులేదు. ఇంగ్లీషు ఛానెలు దాటిరావలన్నా, ఉత్తరాన నార్వేనుండి ఉత్తర సముద్రం దాటాలన్నా జర్మను

లకు విశేష నౌకాబలం, విమానబలం వుండాలి. నార్వే యుద్ధంలోను క్రీటు యుద్ధంలోనుగూడ జర్మను సైనికులను రవానాచేయు నౌకలు పెక్కింటిని బ్రిటిషు విమానాలు ముంచివేసినవి. అపుడు జర్మనువిమానబలం చాల ఎక్కువగనుండెను. అందుచే దిగువనున్న బ్రిటిషునేనలు నార్వేలోను క్రీటులోను వెనుకకు తగ్గుచునే యుద్ధంచేయవలసి వచ్చెను.

ఇపుడు బ్రిటనుపై దాడి అవకాశాలు వేరు. జర్మను విమానాల సంఖ్యతో బ్రిటిషు విమానాల సంఖ్య సరిసమానం అయిందని రెుటీవలనే చర్చిల్‌గారు ప్రకటించారు. కావున ఇంగ్లీషు ఛానెలుపై బ్రిటిషు విమానాల అధికారానికి అడ్డు లేదు. బ్రిటిషు నౌకాదళం దీవిని యెల్లపుడు కాపాడుచు శత్రునిరోధం చేస్తునేవుంటుంది. ఇక హిట్లరునేన విమానాల మీద ఇంగ్లాండులోదింపి వారికి సప్లైలు అందజేసే ఏర్పాటు చేసుకోవాలి. ఆ సప్లైలు సముద్రంమీదే రావలెను. సముద్రంపై హిట్లరు నౌకలు నిర్నిరోధంగా నాల్గువారాలకు తక్కువకాకుండా రాధారి ఏర్పరుచుకోవలెను. అంత కాలం బ్రిటిషు నౌకాబలం యొక్క ఫిరంగులను జర్మను నౌకలు ఎదిరించగలవా?

## హిట్లరుకుగల అవకాశాలు.

హిట్లరు నేనను ఇంగ్లాండుపైకి ఎట్లా పంపించగలడో ఆలోచిద్దాం. సన్నని ఇంగ్లీషు ఛానెలుకడ్డముగా రెండువైపులమందు గనులునాటి తన స్టీమరులకు ఒకసముద్రమార్గం ఏర్పరుచుకోవచ్చు. బ్రిటిషు నౌకలు ఆ మందు గనులను తొలగించకుండాను, తన నేననుతెచ్చు నౌకలను ముంచకుండాను తన విమానాలు దిగువగా ఎగురుచు బాంబులువేసి రక్షించుకోగలవని, బ్రిటిషు విమానాలను రాకుండాచేసి తన నేన యొక్క ప్రయాణాన్ని కాపాడగలవని, హిట్లరు ఆశించవచ్చును. అంతేకాక అదేసమయమున నార్వేనుండి బ్రిటను తూర్పు తీరమున, ఉత్తర ఫ్రాంసునుండి బ్రిటను నైరుతి తీరమునగూడ అనేకచోట్ల తన నేనను దింపుటకు ప్రయత్నింపవచ్చును. పోయిన సంవత్సరము ఆతనివిమానాలు దాడి చేయలేకపోతే, యీ యేడుకూడా చేయలేవనుకోడానికి వీలు లేదు. జర్మనీ నౌకాదళంకన్న 1½ రెట్లధికంగావుండిన ఫ్రెంచి నౌకాదళం కొంతభాగం యిపుడు విషీ ప్రభుత్వంవారు హిట్లరుకి ఒప్పగించవచ్చును. వాటినుపయోగించి అట్లాంటిక్ సముద్రమునందు బ్రిటిషు నౌకాదళానికి పెద్దయుద్ధంలో పని కల్పించి, ఇంగ్లీషు ఛానెలువైపునకు యీదాడి సమయానికి రాకుండా చేయవచ్చును. గత ఏప్రిలులో యిలాగే, బ్రిటిషు నౌకాదళాన్ని యేమార్చుటకై ఇటలీ నౌకాదళాన్ని మటపం యుద్ధంలో త్యాగంచేసి, జర్మనులు తమనేనను సిసిలి దీవినుండి ఆఫ్రికాలోని లిబియాకు సముద్రందాటించిరి. విశేషంగా సైన్యం బ్రిటిషుతీరాన్న దింపాలంటే కొన్ని రేవులు జర్మనీవారి వశమందుండవలెను. అందుకని విమానాలలో కొన్ని నేనలను పంపి ఒక దక్షిణతీరపు రేవు వెనకాతల దింపి, ఆ రేవునకు బ్రిటిషువారి నేలసైన్యం సహాయంరాకుండా అడ్డుచు, దాన్ని వశపరచుకొన్నపిదప ఆరేవులో జర్మను నేనలు నౌకలపై దిగవచ్చును. క్రీటు దీవిలో యిట్లుచేసిరి. అచట విమానాలపై దిగిన జర్మనుసైనికులెందరో వేలకువేలు నేలకాలుపెట్టకముందే చంపబడిరి. అయినా ఎక్కువమందిని హిట్లరు త్యాగంచేసెను. పోలండుదాడికి 52 డివిజనుల నేనను ఉపయోగించెను. హిట్లరు తనకార్యం నెరవేర్చుటకు ఎంత సైన్యం చచ్చినా ఎన్ని యంత్రాలుపోయినా లక్ష్యంచేయడు. కాని బ్రిటిషు సైన్యం అన్నిరకాలుకలసి సుమారు 40 లక్షలుకలదు. ఇంతనేనను ఓడించడానికి హిట్లరు ఎన్ని డివిజనుల నుపయోగించాలో ఆలోచించుకోండి.

తరువాత ఒకవేళ జర్మనునేన దిగినా దానికి సప్లయిలెలా వస్తాయి. జర్మనుల యంత్ర సహాయదళం 5 డివిజనులుంటే 1,800 టాంకులు, 10,000 మోటారులు, 1,000 మోటారు సైకిల్లుంటాయి. ఇవన్ని సముద్రందాటడానికి 1,000 నౌకలు కావాలి. ఇంతనేనకు ఒకవారం వరకైనా సరిపోడానికి 2,500,000 గాలనుల పెట్రోలే కావాలి. తక్కిన సామానులగూర్చి చెప్పనే అక్కరలేదు. ఈ వెయ్యినావలు సైన్యాలతో కనీసం మూడు గంటలేనా ఇంగ్లిషు ఛానలుపై ప్రయాణం చేయాలి. ఉత్తర సముద్రం మార్గమైతే 50 గంటలవుతుంది.

ఇవి బయలుదేరే ముందరే బ్రిటిషువారి నౌకల ఫిరంగులు, తీరపు ఫిరంగులు గుండ్లుప్రేల్చి, విమానాలు బాంబులువేసి హతమార్చేస్తాయి. ప్రపంచంలో యితరదేశాలన్నింటికి ఎన్ని నౌకాదళం ఫిరంగులున్నాయో బ్రిటనొక్కటికి అన్ని ఫిరంగులున్నాయి. 1940 వ సం॥ సెప్టంబరులో జర్మనీ దాడికి యత్నించి ఫ్రాంసుతీరాన నౌకలను జతచేసినపుడే బ్రిటిషు విమానాలు వాటిలో ⅛ వంతును, అక్కడ జతపెట్టిన మందుగుండు స్టోర్సు 2/5 వంతు, నాశనం చేసినవి. నార్వేలోవలె క్రొత్తగవచ్చే జర్మను నేనకు తోడ్పడే ద్రోహులు ఇంగ్లాండులోలేరు; క్రీటులోవలె విమానదళ నిరోధం లేకపోలేదు, ఫ్రాంసు, బెల్జియం దేశములలోవలె ఇంగ్లాండులో పరదేశీయులులేరు; దాడివచ్చు జర్మను సైన్యంకన్న బ్రిటిషు సైన్యం సంఖ్య యితర దేశాలలోవలె (రష్యాతప్ప) తక్కువకాదు. కావున బ్రిటను పై దాడి హిట్లరుకు అంతసులభమయిన పనికాదు.

ఒకటి చేయగలడు, ఇంకొకటి చేయలేడని యీ శత్రువు విషయమున అనుకోరాదు. "మన శత్రువు దాడి విషయమున చూపే ప్రజ్ఞ, క్రౌర్యం గాంచినయెడల అన్ని రకముల క్రొత్త ఎత్తులను ఘోరకృత్యములను ఎదుర్కొనుటకు మనం సిద్ధపడక తప్పదు" అని చర్చిల్ ప్రధాని నుడివెను. జర్మనీలోచేసే యత్నాలను బట్టి విమానాలద్వారా సైన్యాన్నిదింపి బ్రహ్మాండమగు దాడియత్నం జరుగుతున్నట్లు తెలుస్తుంది. గ్లైడరులనే జారేవిమానాలు విశేషంగా తయారు చేస్తున్నారు. గాలిగుమ్మటాలకై పట్టుబట్ట అంతా తీసుకున్నారు. అట్టిదాడిలో గెలుస్తామని జర్మను నిపుణులు ఎక్కువమంది నమ్ముటలేదు. అయినా ప్రాణానికి తెగించిన కొన్ని వేలమందిని ప్రేలుడు మందుగుండుతో ఇంగ్లాండులో విమానాలనుండి పడవేస్తే, వారు రాధారులు రైళ్లు పడగొట్టి ఇంగ్లాండులో భీభత్సం చేయగలరని, అందువలన చాలనష్టం కలుగ జేయగలరని వారి నమ్మకం. జర్మను వైమానికులు గుంపుగా వస్తేనేమంచిది, వారిని క్రింద దిగకుండా ఎగురగొట్టగలమని బ్రిటిషు వైమానికులు దృఢవిశ్వాసం కలిగియున్నారు. జర్మనులు విషవాయువులు, విషక్రిములు ఉపయోగిస్తే బ్రిటిషువారుగూడ వాటిని ఉపయోగించగలరు. చర్చిల్ ప్రభుత్వంవారు అన్నింటికి తగుయేర్పాటులు చేసిరి, హిట్లరు ఎత్తులన్నింటికి విరుగుడు సిద్ధంచేసి తయారుగానున్నారు.

# యుద్ధ పరిశ్రమలు.

వస్త్రములు, జోళ్లు, రసాయనములు ఇండియాలో విశేషంగ తయారవుతున్నాయి.

సామాన్యంగా ఆయుధాలు వుంటే, ఎంతయుద్ధమైనా చేయవచ్చుననీ, మరేమీ అక్కరలేదనీ చాలమంది అనుకుంటూ వుంటారు. పూర్వకాలంలోనైతే అది సాధ్యమయ్యేదేమోగాని, నేటికాలపు యుద్ధాలలో అది సాధ్యంగాదు. యుద్ధానికి ఆయుధాలు మందుగుండు సామగ్రి యెంత అవసరమో, అంతకంటెకూడా అవసరం—సైనికులకు కావలసిన ఆహారపదార్థాలు, దుస్తులు, తోలు సామగ్రి, కలప, గుడ్డలు రసాయనిక ద్రవ్యములు మొదలగునవి. అవి లేకపోతే సైనికులకు ఒక్క అడుగైనా సాగదు. అందుచే దీని ప్రాధాన్యతను గమనించి ఇటువంటి యుద్ధపరికరాల నన్నిటిని కొనుటకుగాను ప్రభుత్వంవారు ప్రత్యేకంగా ఒక్క శాఖను యేర్పరిచారు. దానిని సప్లైస్ శాఖ అని అంటారు. సైనికులకు కావలసిన దుస్తులు వగైరా సామగ్రుల నన్నిటినీ, సప్లైచేయటం ఈ శాఖయొక్క కర్తవ్యం.

## వస్త్రములు, గుడ్డలు.

ఈ శాఖ సప్లైచేయవలసినవానిలో మొట్టమొదటిది సైనికుల దుస్తులు గుడారాలు మొదలైనవి. భారతదేశం ఒక్క భారత సైనికులకేగాదు, ఆస్ట్రేలియా, ఆఫ్రికా, ఇరాక్, ఇరాక్ మొదలగు దేశాలన్నిటికికూడ గుడ్డను సప్లై చేయవలసివుంది. దీనివలన ఈ దేశంలోని మిల్లు లన్నిటికీ, రాత్రింబగళ్లు సరిపోయినంతపని లభించింది. ఇదివరకు మూలపడివున్న మిల్లులన్నీగూడ, తిరిగి పనిచేయటం ప్రారంభించాయి. ఇపుడీదేశంలోని గుడ్డల మిల్లుల ఉత్పత్తినిగురించి తెలియాలంటే, సైనిక శాఖవారీమధ్య కొనిన సరకుయొక్క పరిమాణంచూస్తే తెలుస్తుంది. గత మార్చినెలలో 8 కోట్ల గజముల "ఖాకీ" రంగుగుడ్డను, 170 లక్షల గజాల "కాన్వాస్" గుడ్డను కొనుటకు ప్రభుత్వంవారు ఒడంబడిక చేసుకున్నారు. వీని ఖరీదు రూ. 85 కోట్లు వుంటుంది. దేశీయ మిల్లులు ఈ సంవత్సరం 3,240 లక్షల గుడ్డను ఉత్పత్తి చేస్తున్నాయి. ఇదికాక, గుడారములకొరకు రూ. $6\frac{1}{2}$ కోట్ల విలువగల సరకునకు, రూ. 1½ కోట్ల విలువగల దుప్పట్లకు బజానాయిచ్చారు. 1941-42 వ సంవత్సరంలో, ఈదేశంలో మిల్లులనుండి రూ. 45 కోట్ల విలువగల గుడారపు గుడ్డను కొనదలచిరి.

యుద్ధంవలన గుడ్డల మిల్లులకేకాక చేనేత పరిశ్రమకుకూడ మంచి ప్రోత్సాహంకలిగింది. 1941 లో ప్రభుత్వంవారు సైనిక శాఖకు కావలసిన దుప్పట్లు మొదలగు ముతకరకపు గుడ్డలో రూ. 75 లక్షల విలువగల 10 లక్షల గజముల గుడ్డను చేనేత పారిశ్రామికులవద్దనుండి కొన్నారు. రాబోవు సంవత్సరం అంతకంటె ఎక్కువ కొనుటకు నిశ్చయించుకున్నారు.

## ఆహార పదార్థములు.

ఈ దేశంలో ఆహారపదార్థాలు ప్రతి సంవత్సరము సమృద్ధిగానే లభిస్తున్నాయి. కాని పండ్లు, కాయలు మొదలగు వానిని నిలవచేసి, ఇతరప్రాంతాలకు పంపే పరిశ్రమలు ఎక్కువ లేవు. అందుచేత సైనికశాఖకు కావలసిన పండ్లు వగైరా పదార్థాలకోసం, విదేశాలమీద ఆధారపడవలసివుండేది. ఇపుడు, సైనికశాఖకు కావలసిన నిలవపండ్లు మొదలగువాటి నన్నిటిని ఈ దేశంలోని పరిశ్రమలనుండియే కొనుటకు నిశ్చయించారు. పండ్ల తోటలు విస్తారంగాగల ప్రాంతాలలో క్రొత్త ఫ్యాక్టరీలను నెలకొల్పడానికి ఉత్తరువుచేశారు. పండ్లలాగే, సైన్యాలకు కావలసిన పాలకొరకు, డబ్బాపాల పరిశ్రమను నెలకొలుపు ప్రయత్నాలు సాగిస్తున్నారు.

## తోలు వస్తువులు.

సైనిక శాఖకు కావలసిన ఇతర వస్తువులలో జోళ్లు, గుర్రపు జీనులు మొదలగు తోళ్లతో చేయబడు వస్తువులు ముఖ్యమైనవి. ఇదివరకు ప్రభుత్వంవారీ వస్తువులను కాన్పూరులోవున్న తమ స్వంత ఫ్యాక్టరిలో తయారు చేసుకుంటూ వుండేవారు. అందులో 2,000 మంది కార్మికులు పనిచేస్తుండేవారు. ఇపుడచటి పనివారి సంఖ్య 12,000 లకు హెచ్చింది. అప్పటికీ సరకు సరిగా సప్లై కాకపోవటంవల్ల మరి 200 మంది కంట్రాక్టర్లకు కూడ ఈ పనిని అప్పగించిరి. అదిగాక ప్రభుత్వంవారు బెంగాలులో ఒక ఫ్యాక్టరీని సంయుక్త పరగణాలలో మరియొక ఫ్యాక్టరీని ఇటీవల నెలకొల్పిరి. ఇంకా ఇతర ప్రాంతాలలోకూడ ఫ్యాక్టరీలను యేర్పాటుచేయుటకు ప్రయత్నాలు చేస్తున్నారు.

యుద్ధానికి పూర్వం సైనికుల దుస్తులు కుట్టడానికి ఒక్క ఫ్యాక్టరీ వుండేది. అందులో 800 మంది పనిచేస్తుండేవారు. ఇపుడు క్రొత్తగా మరి 8 ఫ్యాక్టరీలను పెట్టిరి. అవి చాలక చాలభాగం ఇతర కంట్రాక్టరులద్వారా కుట్టిస్తున్నారు.

## కర్రపనులు.

యుద్ధ కార్యాలకు చాలా కలప కావలెను. కుర్చీలు, మేజా బల్లలు మొదలగునవి గాక దూలాలు బల్లలు మొదలగు వానికై 24,800,000 ఘనపు అడుగుల కలపను ప్రభుత్వం వారు కొన్నారు. దాని విలువ రూ. 334 లక్షలు. ఈ సప్లైలలో చాలభాగం సంయుక్త పరగణాలనుంచి, చెన్నరాష్ట్రం అస్సాములనుంచి వచ్చినది. ఈ కలపలో చాలభాగం ఈ దేశంలో యుద్ధ ఖైదీలకు నివాసాలు నిర్మించడానికి, విదేశ యుద్ధ రంగాలలోవున్న భారతీయ సైనికులకు శిబిరములు నిర్మించడానికి వినియోగింపబడుచున్నది.

## మందులు మొదలైనవి.

యుద్ధం వలన మంచి ప్రోత్సాహం పొందిన పరిశ్రమలలో ఓషధీ (మందుల) పరిశ్రమ యొకటి. ఇదివరకు సివిలు వైద్యశాలలలోను సైనిక శాఖ వైద్యశాలలలోను కావలసిన మందులలో చాల భాగం విదేశములనుండి దిగుమతి యగుచుండేవి. యుద్ధం వచ్చిన తరువాత సాధ్యమైనంతవరకు వానిని ఈ దేశంలోనే తయారు చేయడానికి ప్రయత్నాలు జరిగాయి. దాని ఫలితంగా ఇదివరకు దిగుమతియగుచుండే వస్తువులలో 292 మందులు యీ దేశంలో మదరాసునందు, బెంగాలునందు ప్రభుత్వంవారి మెడికలు స్టోర్సు ఫ్యాక్టరీలయందే తయారు చేయబడుతున్నాయి. రోగులకు బలం కల్గించడానికి ప్రపంచం అంతటా ఉపయోగింపబడే "కాడ్‌లివరు" నూనెకు బదులు "షార్కు లివర్ ఆయిల్" అని క్రొత్తగా కనిపెట్టిరి. అది మన రాష్ట్రమునందు తయారగుచున్నది. ప్రభుత్వంవా రొక్కరే 8,000 గాలనుల నూనెను కొన్నారు. క్లోరోఫారం మొదలగు అనేకమందులు, ద్రావకాలు శస్త్రచికిత్స సాధనాలుగూడ ఈ దేశంలో గత రెండు సంవత్సరాలలోను విరివిగా తయారగుతున్నాయి. సంవత్సరంలో సగం రోజులు పంచదార మిల్లులకు పని వుండదు. అందుచే ఆరు నెలలలో ఆ ఫ్యాక్టరీలలో యుద్ధానికి కావలసిన "స్ట్రెచ్చరు" లు మొదలగు పనిముట్లను తయారు చేయవలసినదని ప్రభుత్వంవారు ఉత్తరువు చేస్తున్నారు.

# "ఆర్కు-రాయల్" మునిగిపోవుట.

## విమానాలను మోసుకపోయే పెద్ద యుద్ధ నౌక.

హెచ్.ఎం.ఎస్. ఆర్కు-రాయల్ అను పేరుగల యుద్ధ నౌక 13 వ తేది మధ్యాహ్నం మధ్యధరాసముద్రంలో జిబ్రాల్టరు రేవు చేరుచుండగ దానికి తూర్పువైపున మునిగిపోయినది. సబుమెరైను ఒకటి నీటిలోనుండియే దానిని టార్పెడోతో కొట్టియున్నందున మునిగిపోయింది.

ఆర్కు-రాయలు చాల ప్రసిద్ధిచెందిన యుద్ధ నౌక. దానిపై 70 విమానాలను మోసుకపోగలదు. అందు 4½ అంగుళముల ఫిరంగులు 16 గలవు. గంటకు 103 మైళ్లపైగా ప్రయాణంచేయగలదు. ఇది తన జీవితంలో మొత్తం 100 శత్రు విమానాలనైనా పడగొట్టియున్నది. ఇదివర కెన్నిసారులో దీనిని ముంచివేసితిమని జర్మను అధికారులు అబద్ధపువార్తలు ప్రకటించియుండిరి. చివరకు యిపుడు మునిగి నాక ముందుగ బ్రిటిషు అధికారులే ఆ వార్త ప్రకటించిరి.

యుద్ధంలో నౌకాదళానికి సహాయంచేసే విమానాలు కొన్ని వుంటాయి. అవి గాలిలోనికి యెగిరి తిరిగి నేలనుగాని నీటిలోగాని దిగుచుండుటకన్న, పెద్ద యుద్ధ నౌకల పైకప్పు అందే నివాసముండి అక్కడనుండే యెగురుచు దిగుచూ వుంటే, నట్టనడిసముద్రంలోగూడ విమానదళం యుద్ధం యెక్కువసేపు కొనసాగించుటకు వీలుండును. అందుకని విమానాలను మోసుకపోగల యుద్ధనౌక మొట్టమొదట "ఈగిలు" అను పేరుతో 1917 లో కట్టబడింది. అందు 21 విమానాలుమాత్రమే వుండేవి. తరువాత ఫ్యూరియసు, కరేజియసు, గ్లోరియసు అన్నవి నిర్మింపబడ్డాయి. అన్నింటికన్న ఆఖరుకి సరిక్రొత్త పద్ధతులతో కట్టబడిన పెద్ద విమానాల యుద్ధ నౌక ఆర్కు-రాయలు. కరేజియసు, గ్లోరియసు అన్నవి యిదివరకే యీ యుద్ధంలో మునిగిపోయినవి.

### ఆర్కు-రాయలు ఘనకార్యములు.

ఆర్కు-రాయలు యుద్ధనౌక లన్నింటిలోకి ప్రధానమైనదిగ నుండేది. ఇది కట్టుటకు 2½ సంవత్సరములైనది. 1937 వ సం॥ ఏప్రిల్‌లో నీట దిగినది. 30 లక్షల సవరనుల ఖరీదయింది. 22,000 టన్నుల బరువుగలది. దీనిపై 1,600 నావికులు సైనికులు వుండుటకు తావుగలదు. ఇతర స్టీమరు లన్నింటికన్న దీనిపై యెక్కువ విమానాలు (70), యెక్కువ నావికులు ప్రయాణంచేయగలరు. ఈ యుద్ధంలో అనేకచోట్ల యీనౌక పనిచేసింది. సబుమెరైనులను వెదకుట, శత్రు యుద్ధనావల ఆచోకీతీయుట, రవానాయగుచుండు సైన్యాలకు కాపలాయుండుట దీనిపనులు. జర్మను విమానాలు దీని నెన్నోసారులు గురిచూచికొట్టినవి. 1939 లో దీనిని ముంచేశామని జర్మను అధికారులు ప్రకటించి, ఆ ముంచిన వైమానికుడికి బిరుదులుకూడా యిచ్చారు. తరువాత ఇదెక్కడుందో తెలుసుకొనుటకై చాల ప్రయత్నించారు. కాని బ్రిటిషు ప్రచురణశాఖవారు దీని ఆచోకి తెలుపకుండా రహస్యంగా వుంచారు. ఇదిమాత్రం సముద్రాలలో తిరుగుచు యుద్ధం సాగిస్తూనేవుండినది.

దక్షిణ అట్లాంటికు సముద్రంలో తిరుగుచుండిన జర్మను యుద్ధనౌక "గ్రాఫ్‌స్పీ" అనుదానిని ఆర్కు-రాయల్ వెదకుచున్నపుడు దీనిపైనుండు విమానాలు జర్మను సప్లయి నౌకలను యెన్నింటినో కనిపెట్టి ముంచివేసినవి. కొన్నిసమయములందు 30 దినములు రేవుచూడకుండా సముద్రంలోనే ప్రయాణంచేసేది కూడాను. అపుడుఎకాయెకిని 15,000 మైళ్లు ప్రయాణంచేసింది. 1940 మార్చిలో ఇటలీ ప్రాంతపు సముద్రములందుండెను. ఏప్రిల్‌లో నార్వే యుద్ధంలో పాల్గొనెను. జూలైలో తిరిగి మధ్యధరాసముద్రమునకే వచ్చి, ఇటలీ నౌకాదళానికి చాల నష్టంకలిగించెను. టార్పెడోలు బాంబులువేయు విమానాలు ఆర్కు-రాయలుపైనుండునవి ఇటలీ యుద్ధనౌకను సార్డినియావద్ద ముంచెను.

1941 ఫిబ్రవరిలో జినోవారేవుపై దాడియందు ఆర్కు-రాయలు విమానాలు బాంబులువేసి చమురు గనులను, రైల్వే జంక్షనులను తగులబెట్టినవి. మే మాసంలో "బిస్మార్కు" అను జర్మను యుద్ధనౌకను ఇది వేటాడుటకై అట్లాంటికు సముద్రంలో ప్రవేశించెను. మే 20 వ తేదిన బిస్మార్కు ఫ్రాంసు తీరాన ఒకరేవు చేరనుందనితెలిసి, ఆర్కు-రాయలు విమానాలు దానిపై సూటిగ బాంబులువేసి దానిని కుంటుపరచినవి. అందుచే నది నెమ్మదిగా తీరానికి చేరువగ పోవలసి వచ్చెను. అపుడు ఇంగ్లాండుతీరపు యుద్ధనౌకలు బిస్మార్కును యెదిరించి ముంచివేసినవి. తరువాత ఆర్కు-రాయలు మరల మధ్యధరాసముద్రంలోనికివచ్చి, ప్రయాణపు నౌకల కానాయి (కాపలా) యందు పాల్గొనుచుండెను. మొత్తం 100 శత్రువిమానాలు దీనిచే యీ యుద్ధంలో కూల్చబడెను. అందు 67 మధ్యధరాసముద్రమునందే. దేశానికి చాల సేవచేసిన యుద్ధనౌకపోవడం వలన నౌకాదళానికి లోటే కలిగిందని నౌకాదళాధికారి ప్రకటించెను.

ఆర్కు-రాయలు నౌకను కెప్టను మాండు అను అనుభవజ్ఞుడు నాయకుడుగా నడుపుచుండెను. అది మునిగిపోయినపుడు ఒక్క నావికుడు చనిపోయి, మరొక్కడు గాయపడెను. తక్కినవారంతా రక్షింపబడిరి.

---

# విమానాలు కట్టుటకు కలప.

## ఇండియాలో విశేషంగా లభించుట.

విమానాలు నిర్మించుటకు తగిన గట్టితనముగల్గి బరువులేని కలప ఇండియాలో యెక్కువగా కొన్ని నారాలనుండి దొరకుచున్నది. అది యిపుడు విమానాలు కట్టుటకు ఉపయోగింపబడుచున్నది. 1915-18 వ సంవత్సరాలలో ఎరుగని యితర రకముల మంచి కలపగూడా యిపుడు ఇండియాలో దొరకుచున్నది.

ఎట్టి లోపములేని నిడుపైన దూలములు విమాన నిర్మాణమున కుపయోగపడునవి ఇండియా అడవులందు దొరకవనే గతయుద్ధంలో అడవి శాఖవారు తెలిపియుండిరి. కాని సివిలు విమానాల అధికారులును అడవి పరిశోధన శాఖవారును కలిసి విచారణచేసి చూడగ, అంత నిడుపైనవి కాకున్నా, తక్కువ కొలతలోనే అదేరకం దూలాలు ఇండియా "ఫరు" వృక్షములనుండి తయారుచేయవచ్చునని తెలిసెను. ఇపుడు వాటి నుపయోగిస్తున్నారు.

విమానాలకు ముందు తిరిగే చక్రాలు ఇండియా కలపనుండి తయారుచేయబడినవి. చాల సంతృప్తికరముగనున్నవి. కాలం గడిచినకొలది గిరాకి హెచ్చుచుండును. శాస్త్రి పరిశోధన అందుకనుకూలంగా జరుగుచుండెను. 20 సంవత్సరాలక్రింద పనికిరాని వృక్షాలు, యిప్పటి పరిశోధనాల ఫలితంగా విమానాలు నిర్మించు కలపకు పనికి వచ్చినవి. ఈ పరిశోధన నిరుపయోగం కాలేదు. ఈ అడవులలో కలప కొట్టి, రాను-రాను ఎక్కువగా విమానాలు తయారు చేయుటకు ఉపయోగిస్తున్నారు. ఈ పరిశోధనా కార్యాలు యింకా కొనసాగించుచున్నారు.

# జర్మనీ కొరకు.



ఈ పటంలో తెల్లనివి బాంబులు. అవి చిన్న చక్రాల ట్రక్కులపై దూరాన వేచియున్న బాంబరు విమానములో నెక్కించుటకు పోవుచున్నవి. ఆ విమానం తరువాత జర్మనీ ముఖ్య పట్నమగు బెర్లిను, హాంబర్గు మున్నగు పరిశ్రమలుగల నగరాలపై ఎగిరి బాంబులువేసి విశేష నష్టం కలిగించినట్లు వార్తలు వచ్చినవి.

# తూర్పుదేశాలలో యుద్ధ మేఘాలు.

## వాషింగుటను నగరంలో రాయబారాలు.

తూర్పు ఆసియా దేశాలలో అమెరికాకు—జపానుకు "యుద్ధమా—శాంతియా?" అనే విషయం తేలకుండ వుంది. అమెరికాతో తమకు కల వివాదాలన్ని పరిష్కరించుకొని సమాధానం కుదుర్చుకొనుట కొరకు జపాను ప్రభుత్వం పంపిన ప్రత్యేక రాయబారి, అమెరికాచేరాడు. నాల్గు రోజులు క్రిందట, అమెరికా ప్రభుత్వాధ్యక్షుడైన రూజ్వెల్టును, దేశీయాంగ కార్యదర్శియైన కార్డెలు హల్లు గారిని చూచి యింకను వారితో మాట్లాడుతున్నాడు. 20 వ తేదీన పత్రికా విలేఖరుల ప్రశ్నలకు సమాధానమిస్తు "సమాధానం కుదురుననే నమ్మకం నాకింకా పోలేదు" అన్నాడు. హల్లుగారుమాత్రం తానిపుడేమీ చెప్పలేనన్నాడు.

కాని వ్యవహారాలు చూస్తే సమాధానం కుదిరే సూచనలులేవని చాలమంది తలుస్తున్నారు. అమెరికా ప్రభుత్వం, చాల సంవత్సరాలుగ ఉత్తరచైనాలో టీన్ట్సిన్ పెకింగ్, షాంగుహాలలో నిలిపియున్న నావలను స్వదేశానికి మరల్చి తెచ్చుకొని ఆ దేశాలను ఖాళీ చేయడానికి నిశ్చయించుకుంది. బ్రిటిషు అధికారులుకూడా షాంగుహాలోని ఆంగ్లేయులందరను స్వదేశానికి మరలిరావలసినదని తుది హెచ్చరిక చేశారు. ఉత్తరచైనా అంతా జపాను ఆక్రమణలోవుంది. తమ దేశీయులను అక్కడ వుండనియ్యడం—యుద్ధం సంభవిస్తే ప్రమాదకరమని బ్రిటిషు ప్రభుత్వంవారి అభిప్రాయం. అందుచేత, ఆ ప్రాంతాలలోనుంచి ఖాళీ చేసిరమ్మని తమ దేశీయులను హెచ్చరించారు. ఇదే సమయాన బ్రిటిషు ప్రభుత్వం వారు దక్షిణచైనాలోని హాంకాంగ్ రేవునందు కెనడానుండి సైన్యాలను తెచ్చిదించి వానిని శత్రుబాధలనుండి కాపాడుకోడానికి సన్నాహాలు చేస్తున్నారు. హాంకాంగునకు ఇంకా నైరుతిమూలగానున్న సింగపూరునందుగూడ భారత దేశము నుండి ఆస్ట్రేలియానుండి సైన్యాలను దింపి శత్రుబాధలను నిరోధించడానికి సన్నాహాలను పూర్తి చేస్తున్నారు. ఆస్ట్రేలియా మంత్రులు న్యూజిలాండు మంత్రులు "ఏ క్షణమైనా తూర్పు ఆసియా సముద్రంలో యుద్ధం సంభవింపవచ్చున"ని, సిద్ధముగా యుండవలెననీ తమ ప్రజలను హెచ్చరించారు.

జపాను ప్రభుత్వం, చైనాకు దక్షిణంగావున్న ఇండోచైనాలో సైన్యాన్ని విశేషంగా చేరుస్తున్నారు. దానిని బర్మామీదగాని చైనాలోని క్వాంగ్సీ రాష్ట్రంమీదగాని దాడి తీయుట కుపయోగింపవచ్చునని చైనీయులు వూహించుకుంటున్నారు.

జపానులోగూడ సన్నాహాలు జరుగుచున్నాయి. జపాను మంత్రివర్గం దేశరక్షణకోసం ఇదివరకు నిర్ణయించుకున్న 5,150 లక్షలుగాక ఈ నాల్గు నెలలలోను మరి 38,000 లక్షల 'యెన్ను' నాణెములను వెచ్చించుటకు నిశ్చయించుకుంది. ఇదివరకు సైనికవృత్తినుండి మినహాయింపబడిన ప్రజలందరనుగూడ ఇపుడు సైన్యంలో చేరవలెనని జపాను చక్రవర్తి ఉత్తరువుచేశాడు. దేశంలోని పరిశ్రమలన్నిటిని యుద్ధకార్యాలకు అవసరమగు వస్తుసామగ్రిని తయారుచేయుట కుపయోగించుటగ, విమానదాడుల రక్షణ యేర్పా

టులకు మంత్రివర్గంవారు క్రొత్త చట్టాలను ప్రవేశపెట్టిరి. జపాను శాసనసభలు వానినన్నిటిని ఏకగ్రీవంగా ఆమోదించెను.

జపాను ప్రధానియైన 'టోజో' సేనాని, విదేశాంగ మంత్రియైన టోగోగారు పరిస్థితులను విపులంగా శాసనసభ్యులకు వివరిస్తూ జపాను ఇంతకాలంనుంచి స్థాపించుచున్న సామ్రాజ్యాన్నీ భవిష్యత్తునూ వదలుకొని శిథిలమై పోవటమా లేదాయను పరిస్థితులను యెదుర్కొనవలసి వున్నదనియు, అమెరికా- బ్రిటిషు దేశములు జపానుపై ఆర్థికనిషేధాలను అమలు జరుపుటవలన జపాను శిథిలమై పోవుచున్నదనియు తెలియజేశారు. తూర్పు ఆసియాలో శాంతి కుదురాలంటే ఇతర రాజ్యాలు,చైనాకు సహాయం చేయుట మానాలన్నారు.

తుదకు జపాను శాసనసభ అమెరికా వైఖరిని ఆక్షేపిస్తూ, యుద్ధం లేకుండా జపానును యెదుర్కొనియున్న ప్రమాదాన్ని తొలగించుటకు అవకాశం కన్పింపదనీ తెలిపి మంత్రివర్గము అవలంబించే విధానమునకు సంపూర్ణమగు సహాయం వాగ్దానం చేస్తూ తీర్మానం చేసింది.

జపాను క్వాంగ్సీ మీదుగా సైన్యాలను పంపి బర్మా రోడ్డును పట్టుకుంటే, పరిస్థితులు విషమమగునని బ్రిటిషు విదేశాంగ మంత్రి హెచ్చరించాడు. చైనాలోనుండి మంచూరియాను జపాను సైన్యాలు పూర్తిగా ఖాళీచేసి వెళ్లిపోయేవరకు చైనా ప్రభుత్వం యుద్ధం విరమించబోదని, చైనా ప్రభుత్వనాయకుడగు చాంగ్ కై షేక్‌గారు ప్రకటించారు.

# ఈ వారంలో యుద్ధ వార్తలు.

## జర్మనీపై విమానదాడులు.

ఫ్రాన్సులోను, జర్మనీలోను అపుడే చలి బాగా ముదిరి మంచు దట్టంగా పడుచుండుటవల్ల ఆ దేశాలమీద విమాన దాడులు సాగించడానికి అనుకూలంగా లేదు. అయినా, బ్రిటిషు విమానాలు యీ నెల 14 వ తేదీన ఫ్రాన్సు ఉత్తర ప్రాంతపు పట్నాలమీదకు వెళ్లి, చాల క్రిందుగా యెగురుచు, డంకర్కు రేవువద్దనున్న ఒక ఫిరంగుల నిర్మాణశాలమీద చాల బాంబులవేసి ధ్వంసము చేసినవి. మరికొన్ని శత్రు విమానాశ్రయములమీద గూడ చాల బాంబులువేసి శిథిలము చేసినవి. 16 వ తేది రాత్రి జర్మనీలో పెద్ద నౌకా నిర్మాణశాలలుగల ఎమ్డెన్ పట్టణముమీద ఇతర రేవులమీద పెద్ద దాడుల సాగించి రేవులలోని నౌకలలో చాల భాగము నిర్మూలించినవి. శత్రు నౌకలు రేవులనుండి వెలుపలకు రాకుండ, చాల ప్రాంతములలో విమానములు మందుగనీలను గూడ మాటుపెట్టి వచ్చినవి. ఈ దాడులనుండి నాల్గు విమానాలు తిరిగి రాలేదు.

అక్టోబరు నెలలో శత్రు విమానదాడులవలన ఇంగ్లాండు దేశంలో మొత్తం 262 మంది మరణించిరి. 361 మందికి గాయములు తగిలినవి. వీరిలో 34 మంది పిల్లలు.

శత్రు విమానములు యీ వారం ఆంగ్లదేశంమీద సాగించిన దాడులు అత్యల్పం. కొన్ని రోజులు అసలు దాడియే లేదు. 15 వ తేది వుదయం ఒక శత్రు విమానం ఆంగ్లదేశమును ప్రవేశించుటకు ప్రయత్నింపగ బ్రిటిషు విమానం దానిని యెదిర్చి సముద్రంలోకి పడగొట్టింది. సాయంత్రం కొన్ని విమానాలు ఒక్కొక్కటిగా వచ్చి ఆంగ్లదేశపు తీరమున, స్కాట్లండు తీరమున అక్కడక్కడ బాంబులువేసి స్వల్పంగా నష్టం కల్గించాయి. వీనిలో రెండు విమానములను ఫిరంగులతో నేలకు పడగొట్టిరి. 16 వ తేది పగలు ఇంగ్లాండు సమీపమున సముద్రంమీద మరి రెండు విమానాలు పడగొట్టబడ్డా ఆ రోజున మరే విమానాలు దాడి రాలేదు.

## ఈజిప్టు రక్షణకు క్రొత్త సైన్యం.

ఆఫ్రికా రంగములలో యీ వారం యెక్కువ మార్పులు లేవు. లిబియాలో టోబ్రూకు రేవును ముట్టడించియున్న శత్రు సైన్యములు 15 వ తేదీన రేవుమీద ఫిరంగి గుండ్లను విరివిగా గుప్పించెను. కాని వానివలన కోటకు యెక్కువ నష్టం కలుగలేదు. లిబియా, ఈజిప్టు సరిహద్దులందు చిన్న చిన్న సంఘర్షణలు జరిగెను. కాని బ్రిటిషు సైన్యాలు శత్రులకుచాల నష్టము కల్గించి తరిమివేసినవి. ప్రస్తుతం ఈజిప్టులో లిబియామీదనుండి శత్రుదాడి జరిగితే నిరోధించడానికి ప్రత్యేకంగా ఒక పెద్ద సైన్యం తయారుచేయబడింది. ఆ సైన్యానికి కావలసినంత ఆయుధబలం సమృద్ధిగా వున్నదనీ, ఇతర ప్రాంతములనుండి సహాయం అక్కరలేకుండగనే ఆ సైన్యం శత్రులను నిరోధింపగలదని బ్రిటిషు అధికారులు ప్రకటించిరి.

13 వ తేదీన ఈజిప్టులోని బ్రిటిషు సైన్యములు లిబియామీదకు దాడి సాగించి ఒకేమారు 50 మైళ్లలోనికి చొచ్చుకొనిపోయి ఆక్రమించెను. ఈ దాడిలో ఒక జర్మను గస్తీ దళము, ఫిరంగి మోటారును గూడ పట్టుకొనెను.

## అబిసీనియాలో బ్రిటిషు విజయం.

అబిసీనియాలో ఇంకను కొన్ని ఇటాలియను సైన్యములు తలదాచుకొనియున్న గోండారు ప్రాంతమును బ్రిటిషు సైన్యములు చుట్టుముట్టి దిగ్బంధనము సాగించుచున్నవి. ఇటాలియనులు ముందున్న దుర్గములను, పర్వతములను ఖాళీచేసి ఇంకను లోపలి ప్రాంతమునకు మరలిపోవుచున్నారు. 13 వ తేదీన బ్రిటిషు సైన్యములు గోండారు కోటకు 13 మైళ్లలో నున్న కామారిట్ పర్వతమును ఆక్రమించుకొనినవి.

టానా సరస్సువద్దనున్న ఇటాలియను సైన్యమును లొంగిపోవలసినదని బ్రిటిషు సైనికాధికారులు ఉత్తరువుచేసిరి. ఇటాలియను అధికారుల క్రింద పనిచేయుచున్న అబిసీనియను సైనికులువచ్చి, బ్రిటిషువారిని చేరుచున్నారు.

## ఇటలీ నౌకల నిర్మూలం.

మధ్యధరా సముద్రమునందలి బ్రిటిషు నౌకా దళము, ఇటలీనుండి మధ్యధరా సముద్రముగుండా ఉత్తర ఆఫ్రికాకు సైన్యములను ఆయుధ సామగ్రిని పంపుటకు వీలులేకుండ దారిలో సముద్రమునందు అడ్డము గొట్టి ముంచి వేయుచున్నది. ఈ వారము మొదట్లో, ఇటలీనుండి ఆఫ్రికాకు సప్లయిలను సైన్యములను చేరవేయుచున్న 10 ఇటాలియను నౌకలను, వానివెంట కాపలావెళ్లుచున్న 2 డిస్ట్రాయరు తరగతి యుద్ధ నౌకలను ముంచివేసెను. మరికొన్ని పెద్ద ఇటాలియను యుద్ధ నౌకలు సమీపముననేయుండినవి. కాని తమ సప్లయి నౌకలకు సహాయమువచ్చుటకు బదులు పారిపోయెను. మధ్యధరా సముద్రమందలి బ్రిటిషు నౌకాదళ నాయకుడగు కన్నింగ్‌హాంగారు, బ్రిటిషు నౌకలు చాల ఇటాలియను సప్లయి నౌకలను ముంచుచున్నవనియు, అయినను మరికొన్ని నౌకలు తప్పించుకొని ఆఫ్రికాలోని ఇటాలియనులకు సప్లయిలను అందజేయుచునే యున్నవనియు, వానినిగూడ ముంచివేయవలసియున్నదనియు నుడివిరి.

13 నెలలుగా మధ్యధరా సముద్రప్రాంతములలో విహరించుచు,శత్రునౌకల నిర్మూలించుచున్న "ఆర్కు-రాయల్"

అను పెద్ద బ్రిటిషు యుద్ధ నౌక 13 వ తేదీన జిబ్రాల్టరు రేవు సమీపమున శత్రు జలాంతర్గామిచే ముంచివేయబడెను. నౌకయందలి సిబ్బందిలో ఒకరుతప్ప మిగిలినవారందరును కాపాడబడిరి.

మధ్యధరా సముద్రప్రాంతములలోనున్న బ్రిటిషు విమానములు, శత్రునౌకల ప్రయాణములను కనిపెట్టి యెదుర్చుచున్నవి. అదిగాక, లిబియాయందలి టొబ్రూకు, డెర్నా మొదలగు, ఆఫ్రికాతీరమునందలి శత్రు రేవులను, ఇటలీ దక్షిణ ప్రాంతములలోని రేవులను ప్రతిదినము యెదిర్చి రేవులందున్న నౌకలపై బాంబులువేసి ధ్వంసమొనర్చివచ్చుచున్నవి. అందు ముఖ్యముగ, ఇటలీయందలి, చరిత్ర ప్రసిద్ధమగు నేపిల్సు రేవు పట్టణముమీద చాల దాడుల సాగించి ధ్వంస మొనర్చినవి.

### ఇటాలీ ప్రధాన సేనాని "డిస్టీసు".

ఇటలీ ప్రభుత్వమునకు, విమానదళ ప్రధానాధికారి పదవి నుండి తొలగింపబడిరని ఇటలియను రేడియోలో ప్రకటింపబడెను. రష్యా రంగమునకు 10 డివిజనుల నౌకాదళమును పంపవలసినదని హిట్లరు కోరెననియు, అటుల పంపుటకు ఆయన అడ్డుదగులుటచే హిట్లరుకు కోపమువచ్చెననియు, అతని ఆగ్రహమును తప్పించుకొనుటకుగాను, ముసులినీ అయన్ను తొలగించి యుండుననియు పలువురు తలంచుచున్నారు. ఇదివరకు ఇటాలియను సర్వ సేనాధిపతియు ప్రస్తుతము నేషనలు రిసర్చికౌన్సిలు అధ్యక్షుడునుఅగు బడోగ్లియోగారినిగూడ ముసోలినీ ఆపదవినుండి తొలగించెను. ఇటాలియను యుద్ధనౌకలలో నూటికి 30 వంతులు ఇంత వరకు ముంచివేయబడెననియు ఇంకను చాలభాగం ముంచి వేసినగాని, ఉత్తర ఆఫ్రికాకు కొంతవరకైనను ఇటాలియనుల సప్లయిలు అందుచునే యుండుననియు కన్నింగుహాం గారు నుడివిరి.

### ఈజిప్టు ప్రజల ఆగ్రహం.

సూయజు ప్రాంతముపై దాడి జరుపుచు అక్సిసు విమానములు ఈజిప్టులో ప్రజలు నివసించు ప్రదేశములపైన గూడ బాంబులు వేయుచున్నవి. నిరపరాధులును, అమాయకులును అగు ఈజిప్టు ప్రజలపై నిటుల బాంబుల వేయుట, రాక్షస కృత్యమని, ఈజిప్టు ప్రధానమంత్రియగు సర్రీపాషా గారు ఖండించిరి. ఈజిప్టు రాజగు ఫరూక్‌గారు 15 వ తేదీన శాసన సభను ప్రారంభించుచు, ప్రజలకు కావలసిన ఆహారపదార్థములన్నియు సమకూర్చబడెననియు శత్రువిమాన దాడులనుండి ప్రజలను కాపాడుటకు "రక్షణ శాలలు" నిర్మింపబడుచున్నవనియు ప్రకటించెను. ఇందుకు అవసరమగు ధనసహాయ మొనర్చిన బ్రిటిషు ప్రభుత్వమునకు కృతజ్ఞతను దెలిపిరి.

### టర్కీకి బ్రిటీషు సహాయం.

బ్రిటిషు ప్రభుత్వమువారు, టర్కీకి, ఇదివరకు వాగ్దాన మొనర్చినదానికంటె 20 వేల టన్నులు అనగా మొత్తం 75 వేల టన్నుల గోధుమలను సప్లై చేయుచున్నారు.

### విషీ ప్రభుత్వ చర్యలు.

విషీ ప్రభుత్వ యుద్ధాంగ మంత్రియగు హరిట్జిగరు సేనాని, విమాన ప్రమాదమున ఈ వారము మరణించెను. అతడు ఆఫ్రికా మొదలగు ప్రాంతములన్నిటియందును ఫ్రెంచివారి పరిపాలనయందున్న ప్రాంతములను దర్శించి అచ్చటి సంగతి సందర్భములను ప్రభుత్వాధ్యక్షుడగు పెటెయిన్ సేనానికి దెలుపుటకు వచ్చుచుండగా ఈ ప్రమాదము జరిగెను. హరిట్జిగరుగారి పదవియందు జూయిన్ సేనాని యుద్ధాంగమంత్రిగ నియమింపబడెను.

దక్షిణ ఆఫ్రికా ప్రాంతమున బ్రిటిషువారిచే గత వారము పట్టుకొనబడిన ఫ్రెంచి నౌకలను తిరిగి తమకు అప్పగింపవలెనని విషీ ప్రభుత్వము బ్రిటనునకు తెలియజేసెను. ఆనౌకలు యుద్ధ కార్యములకు వినియోగించు వస్తువులను రవాణా చేయుచున్నవనియు అందుచే వానిని పట్టుకొనుటకు తమకు సంపూర్ణముగ హక్కు గలదనియు బ్రిటిషు ప్రభుత్వము ప్రకటించెను.

ఇంతవరకును ఉత్తర ఆఫ్రికాప్రాంతములలోని ఫ్రెంచి పరిపాలిత రాష్ట్రములకు పరిపాలనాధికారిగనున్న వేగాన్ సేనానిని, 18, 19వ తేదీలలో ఫ్రాన్సుకు పిలిచి, పెటెయిన్ సేనాని సంప్రదించెను. వేగాన్ సేనాని ఫ్రెంచి యుద్ధాంగ మంత్రిగ నియమింపబడవలెనని జర్మనులుకోరిరి అతడంగీకరించినటుల లేదు. అందుచే వేగాన్ సేనానిని ప్రస్తుతమున్న పదవినుండి తొలగించుచు, విషీ ప్రభుత్వం ఉత్తరువు చేసినటులు ప్రకటించబడెను.

### ఆక్రమిత ప్రాంతాలలో తిరుగబాటులు.

ఆక్రమిత దేశములలో ప్రజలలో అలజడి చాల అధికమైనదనియు, తిరుగబాటులు జరుగుచున్నవనియు, జర్మను అధికారులే, బర్లిను రేడియో వార్తలలో అంగీకరించిరి. యూగోస్లావియాలో, సర్వియనులు తిరుగు బాటును అణచుటకు జర్మనులు 320 సైన్యమునంపిరి. కాని తిరుగబాటుదారులు, వారినందరను హతమార్చిరి. అందుచే జర్మను అధికారు లిపుడు ఇతర దేశములయందుంచబడిన సైన్యమును మరల్చుకొని యుగోస్లావియాకు పంపుచున్నారు. అక్కడ, జర్మను సైనిక శిబిరములను అన్నిటి పైనను దాడులు జరుపుటకు, యుగోస్లావియా సైనిక మాజీ నాయకులు సన్నాహము లొనర్చుచున్నారు.

హాలెండు దేశమునకు సంగ్రమానంతరం స్వపరిపాలన మొసగు వుద్దేశం జర్మనీకి లేదనియు ఇకమీద హాలెండు జర్మనీయందొక భాగముగనే యుండుననియు, హాలెండులో జర్మను పరిపాలనాధికారియగు సెసిక్‌క్వార్టు వెల్లడించెను.

తమ కోర్కెల ప్రకారము, క్రోషియాలో తాము నెలకొల్పుచున్న ప్రభుత్వమున చేరి సహాయము మొనర్పలేదను కారణముచే జర్మను అధికారులు, క్రోటు నాయకుడగు మాచెక్‌గారిని అరెస్టుచేసి, ఆస్ట్రియాలోని నిర్బంధితుల శిబిరమునకు పంపిరి.

శత్రుల జేరి, యంత్రాలయములలో ద్రోహచర్యలగావించిరను ఆరోపణపమీద జర్మను అధికారులు 14 వ తేదీన 5 మంది జెక్కు ప్రముఖులను పురితీసిరి.

### తటస్థ దేశాలు.

స్పెయిను విదేశాంగ మంత్రి యీ వారము ఇటలీ, జపాను, జర్మను రాయబారులను పిలచి ఆలోచనలను జరిపెను. స్పెయిను ప్రభుత్వము కొన్ని వేలమంది స్పెయిను కార్మికులను జర్మనీకి పంపుటకు జర్మను నాయకులకు వాగ్దానమొనర్చెను. వీరిలో మొదటి 600 మంది యీ వారము బయలుదేరెదరు.

ఐర్లండు ప్రభుత్వాధ్యక్షుడగు డివెలెరాగారు ఐరిషు ప్రజలను విరివిగ సైన్యములోచేరి దేశ రక్షణకు సిద్ధముగావలెనని ఉద్బోధించుచు, శీత కాలపు ఆఖరునకు, యుద్ధము నిజముగా తీవ్ర రూపము దాల్చుననియు, ఐర్లండు గూడ యుద్ధ రంగమయ్యే పరిస్థితులు సంభవించుననియు హెచ్చరించిరి.

## శత్రునౌకల ముంచుట.

గడచిన నాల్గు మాసములలోను బ్రిటిషు నౌకల నష్టము చాల తగ్గిపోయెను. నెలకు 2 లక్షల టన్నుల పరిమాణము గల నౌకలకంటె యెక్కువ నష్టముగాలేదు. అంతకు పూర్వపు నాల్గు నెలలతో పోల్చిన యెడల ఇవి సగముకంటె యెక్కువలేదు. గత నాల్గు నెలలో, నెలకు 4 లక్షల టన్నుల పరిమాణముగల శత్రు నౌకలు ముంచివేయబడెను.

ఈ నెల 14 వ తేదీని బ్రిటనునుండి అమెరికాకు ప్రయాణ మొనర్చుచున్న "నాటింగ్ హాం" అను నౌక శత్రుజలాంతర్గామిచే ముంచివేయబడెను. గత నెల 1 వ తేదీన షుమారు 53 బ్రిటిషు నౌకలు, యుద్ధ నౌకల రక్షణతో అట్లాంటికు సముద్రమున ప్రయాణ మొనర్చుచుండగా, 13 శత్రు జలాంతర్గాములు జట్టుగా వచ్చి, ఆ నౌకలలో 13 ని ముంచివేసెనని ఇపుడు తెలియవచ్చెను.

## అమెరికా నిశ్చయము.

అమెరికా ప్రజాప్రతినిధుల శాసనసభ ఈ వారం, తాటస్థ్య శాసనాన్ని సవరించుటకు ప్రతిపాదింపబడిన చట్టము ఆమోదించింది. ఆ చట్టము (1) అమెరికను వర్తక నౌకలకు ఫిరంగులను అమర్చవచ్చుననీ, (2) అమెరికను నౌకలు—యుద్ధ ప్రాంతములను విచక్షణలేకుండ—అన్ని ప్రాంతపు రేవులకును ప్రయాణము చేయవచ్చుననీ ప్రకటిస్తున్నది. ఈ చట్టమును రూజ్వెల్టు అధ్యక్షుడు, ఈ నెల 18 వ తేదీనుంచి అమలులోనికి తెచ్చాడు. దీనివలన బ్రిటనుకు, అక్ష రాజ్యాలను ప్రతిఘటిస్తున్న ఇతర దేశాలకు అమెరికా తన స్వంత నౌకలలోనే ఇక మీద ఆయుధ సామగ్రిని, ఆహార పదార్థములను సప్లై చేయుటకు వీలగును. వారానికి 100 వర్తక నౌకల చొప్పున ఆయుధములను అమర్చి, వానిని బ్రిటను మొదలగు దేశాలకు సరకులను అందజేయుటకు వినియోగింపబడునని అమెరికను అధికారులు తెలిపిరి.

రూజ్వెల్టు అధ్యక్షుడు అనుసరించుచున్న ఈ విధానాన్ని, కార్మిక నాయకులలో చాల మంది బలపరచిరి.

మూరు పేరుతో, అట్లాంటికు మహాసముద్రమున ప్రయాణ మొనర్చుచున్న ఒక జర్మను నౌకను, అమెరికా యుద్ధ నౌకలు పట్టుకొని తమ రేవునకు తీసుకొని వెళ్లెను. దానిలో రబ్బరు మొదలగు యుద్ధ పరికరముల కుపయోగించు సరకులు పట్టుబడెను.

## రష్యా యుద్ధము.

రష్యా యుద్ధము, ఈ వారముగూడ, అన్ని రంగముల యందును భయంకరముగనే సాగుచున్నది. జర్మనులు ముందుకు సాగుటకు క్రొత్త సైన్యములను తెచ్చి, తీవ్రమగు ప్రయత్నముల గావించిరి. కాని ఏ రంగమునందును, వారి ప్రయత్నములు ఫలవంతముగాలేదు. లెనిన్‌గ్రాడునుండి తూర్పునకు వెళ్లు రైల్వే కూడలియగు టిక్విన్ అను పట్టణము (లెనిన్‌గ్రాడునకు తూర్పున 110 మైళ్లు) ను జర్మనులు పట్టుకొనిరి. కాని లెనిన్‌గ్రాడును చుట్టు ముట్టియున్న సైన్యములను, రష్యనులు కొన్నిమైళ్లదూరము వెనుకకు కొట్టి, వాని స్థానములను ఆక్రమించెను. లెనిన్‌గ్రాడునకు దక్షిణమున మాస్కో-రంగమున. రష్యనులు జర్మనులను వెనుకకు నెట్టి చాల గ్రామములను తిరిగి ఆక్రమించుకొనిరి. లెనిన్‌గ్రాడు-మాస్కో-రంగములలో దట్టముగ మంచుపడుచుండుటచే యుద్ధము సాగించుటకు చాల ప్రతిబంధకముగ నున్నది.

దక్షిణమున డానెట్జు నదిని దాటుటకు జర్మనులు ప్రయత్నించిరి. కాని ఆ ప్రయత్నములన్నియు విఫలమైనవి. క్రిమియాయందు తూర్పుకొననుగల కర్చి రేవును పట్టుకొంటిమనియు, క్రిమియాలో తూర్పుభాగమంతయు తమ స్వాధీనమైనదనియు జర్మనులు ప్రకటించుచున్నారు. కాని కర్చి రేవు ఇంకను తమ స్వాధీనముననే యున్నదని రష్యను అధికారులు తెలుపుచున్నారు. క్రిమియాలో పడమటి భాగమును, అందలి సెబాస్టపూల్ రేవును ఇంకను రష్యనుల స్వాధీనముననే యున్నవి. సెబాస్టపూల్ రేవును పట్టుకొనుటకు జర్మనులు తీవ్రమగు విమానదాడులను గావించుచున్నారు. దూరపు బారు ఫిరంగులను ఉపయోగించుచున్నారు. కాని అవి రష్యనుల ప్రతిఘటనను తగ్గింపగల్గుట లేదు.

రష్యాలో ఇంతవరకు ఆక్రమింపబడిన ప్రాంతములకు హిటరు, హెర్ ఆల్‌ఫ్రెడ్ రోజన్‌బర్గు అనువానిని పరిపాలనాధికారిగ నియమించెను.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.